ప్రథమ ముద్రణ : 1991

ద్వితీయముద్రణ : 1992

ఎలా చదవాలి ?
(పరీక్షలలో ఉత్తమ ఫలితాలు
సాధించడానికి ఎలా చదవాలో
వివరించే పుస్తకం)

మూల్యము : నాలుగు రూపాయలు

ముద్రణ :

శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్
2/4వ అరండల్‌పేట,
గుంటూరు - 2

ప్రతులకు :

మన్నవ గిరిధరరావు

కార్యదర్శి

యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ
కృష్ణనగర్,
గుంటూరు - 522 006

# ఎలా చదవాలి?

సినిమాకుపోయే వాడెవడూ సినిమా చూడకుండా ఇంటికిరాడు. ఒక సినిమా కాకపోతే మరొక దానికైనా చూసివస్తాడు.

కాఫీ హోటలుకు వెళ్ళినవాడు ఒక హోటల్లో జనం క్రిక్కిరిసివుంటే మరొక హోటలుకైనావెళ్ళి టిఫిన్ చేసి వస్తాడేగాని నిరాశతో తిరిగిరాడు.

ఇలా ఒక పనిచేయదలచినపుడు దాన్ని సాధించి వస్తామేగాని పని సాధించకుండా తిరిగిరావడం జరుగదు.

ఐతే పబ్లిక్ పరీక్షలకు వెళ్ళే విద్యార్థులు మాత్రం అందరూ ప్యాసవడం లేదు. పదవతరగతిలోగాని, ఇంటర్మీడియేట్ లోగాని నూటికి 40 మంది మాత్రమే కృతార్థులవుతున్నారు. అసలు పరీక్షల్లో అందరూ ప్యాసుకారు అనే అభిప్రాయం ఏర్పడింది.

ఏడాది పొడవునా పాఠశాలలోవుండి చదివి, డబ్బు వెచ్చించి, తల్లిదండ్రులకు ఆశలు కలిగించి తుదకు దినపత్రికలో నెంబరు కనపడకపోతే ఎంతో అవమానకరంగా ఉంటుంది. ఈ దుస్థితికి కారణాలను తెలుసుకొని పరీక్షలలో

విజయం సాధించే మార్గాలను గ్రహించవలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నది.

## ప్రతి పనికీ ఒక పద్ధతి ఉంటుంది:

ప్రతి పనికీ దాన్ని చేసేవిధానమంటూ ఒకటి ఉంటుంది. ఇల్లు కట్టాలంటే ఒక ప్లాను వేయడం, పునాదులు త్రవ్వడం, గోడలు కట్టడం, ద్వారాలు పెట్టడం, శ్లాబు వేయడం- ఇలా ఒక విధానం వుంటుంది. వ్యవసాయం చేయాలంటే భూమి దున్నడం, నీరు పెట్టడం, నాటువేయడం, ఎరువు వేయడం- ఇలా ఏ అదనులో ఏమేమి చేయాలో దానికి సంబంధించిన ఒక కార్య పద్ధతి వుంటుంది.

అట్లే, పరీక్షలలో ఉత్తమ శ్రేణిలో కృతార్థులు కావడానికి ఒక స్పష్టమైన విధానంవున్నది. ఆ పద్ధతి తెలియక అనేకులు పరీక్షలలో తప్పుతున్నారు. ఆ విధానమేమిటో విద్యార్థులు మొదట అర్థం చేసుకోవాలి.

## 1. పరీక్షలు తప్పడానికి కారణాలు:

విద్యార్థి పరీక్షలు వ్యాసవడానికై కృషి చేసేముందు అసలు పరీక్షలు తప్పేవారు ఏ కారణాల వల్లన తప్పుతున్నారో తెలుసుకొని ఆ దోషాలు తమలో లేకుండా చేసుకోవాలి.

ఒక తొట్టిని నీటితో నింపబోయేముందు దానికి గల రంధ్రాలను మొదట పూడ్చాలి. లేనిచో పోసిననీరంతా వాటి గుండా కారిపోతుంది. అలాగే విద్యార్థి పరీక్ష తప్పడానికి కారణాలను ముందు పరిశీలించి వాటిని నివారించుకోవాలి.

**a) క్రింది తరగతిలో వుండవలసిన విద్యాస్థాయి లేకుండ పై తరగతికి వచ్చుట :**

కొందరు విద్యార్థులు క్రింది తరగతిలో ఉండవలసిన విద్యాస్థాయి లేకుండ పైతరగతికి రావడం జరుగుతూవున్నది.

ఐదవ తరగతి విద్యాస్థాయి లేకుండ ఆరవతరగతిలోకి, తొమ్మిదవ తరగతి విద్యాస్థాయి లేకుండ పదవ తరగతిలోకి వస్తున్నారు. కొన్ని తరగతులలో పరీక్షమార్కులతో నిమిత్తం లేకుండ హాజరునుబట్టి పైతరగతికి పంపబడు తున్నారు. దీని వలన తగిన విద్యాస్థాయి లేకుండ పైతరగతి లోకి వచ్చినందున ఉపాధ్యాయుడు చెప్పే పాఠాలు అర్థం కాక క్లాసులు మానివేయడం, చదువు మానుకొనడం, పబ్లిక్ పరీక్షల్లో తప్పడం జరుగుతూ వున్నది.

ముఖ్యంగా ఇంగ్లీషు, గణితము, సైన్సులలో కొందరికి చదివే తరగతికి సరిపడే విద్యాస్థాయి ఉండడంలేదు. అట్టి విద్యార్థులు నామోషీ పడకుండా క్రింది తరగతులలో చదువ వలసిన పాఠ్యాంశాలను మరల విడిగాచెప్పించుకొని చదవాలి.

ఇంగ్లీషు గ్రామరు, గణితము, సైన్సులలో విద్యాస్థాయి సుదృఢం చేసుకోవాలి. ఏదో విధంగా పైతరగతికి వచ్చాము నే సంతోషం పనికిరాదు. విద్యాస్థాయి (Standard) లేకుండా పై తరగతికి రావడం విచారకరమేగాని ఆనంద దాయకం కాదు. ఆ తరువాతనైనా ఆయా పాఠ్యాంశాలను చెప్పించుకొని విద్యాస్థాయి పెంచుకోవాలి.

**b) ఉన్నత లక్ష్యం లేకపోవుట :**

చాలామంది ప్యాసుమార్కులువస్తే చాలునను కుంటారు. అలాంటి వారు ప్యాసుకారు.

ఒక విద్యార్థి తనకు పబ్లిక్ పరీక్షలో ఇంగ్లీషులో 35 మార్కులు రావాలనుకుంటాడు. అలాంటి వాడు పరీక్ష తప్పడం ఖాయం. ఎందుకంటే అతని లక్ష్యం 35 మార్కులు. అతడు ప్రయత్నంగూడ 35 మార్కులకే చేస్తాడు. తుదకు ఏ 20 మార్కులో వచ్చి తప్పుతాడు.

అట్లుగాక అతడు 100 మార్కులు రావాలని లక్ష్యం పెట్టుకుంటే అందుకై కావలసిన కృషి చేస్తాడు. తుదకు 70 లేక 60 మార్కులతో ప్యాసవుతాడు.

"Not failure, but low aim is crime" —Carlyle.

"ఒక పనిలో విఫలం కావడం నేరం కాదు, చిన్న లక్ష్యం పెట్టుకోవడం నేరం" అని కార్లయిల్ అను ఆంగ్ల కవి అన్నాడు.

లక్ష్యం పెద్దదయితే ప్రయత్నం (effort) గూడ అత్యధికంగావుంటుంది. ఆశయం కొద్దిదయితే కృషిగూడ అల్పంగా వుంటుంది. దాని ఫలితం గూడ తక్కువగానే ఉంటుంది.

35 లేక 40 మార్కులు చాలు అనే భావనను మనస్సునుండి చెరిపివేసి 100 మార్కులు అనే లక్ష్యాన్ని మనస్సులో పాదుకొల్పాలి. కార్లయిల్ చెప్పిన వాక్యాన్ని పుస్తకంలో వ్రాసుకొని ప్రతిదినం ఒకమారు గుర్తు చేసుకోవాలి.

**c) కొన్ని సబ్జక్టులమీద అయిష్టం :**

ఒక కుండలోనుండి నీరుయావత్తూ కారిపోవుటకు ఎన్ని చిల్లులు కావాలి? పది చిల్లులు అవసరం లేదు. ఒకేఒక చిల్లి చాలు. నీరంతా దానిగుండా కారిపోతుంది.

అలాగే పరీక్ష తప్పేవ్యక్తి అన్నిసబ్జక్టులూ తప్పనవసరం లేదు. ఒక సబ్జక్టులో తప్పినా పరీక్ష మొత్తం తప్పినట్లే. పై తరగతికి పోయేవీలులేదు.

ఒక జరిగిన సంగతి చెప్పుకుందాము. మంచి తెలివి తేటలు గల విద్యార్థి ఒకడుండేవాడు. అతనికి లెక్కలంటే మహా ప్రీతి. పగలూ రాత్రీ లెక్కలు చేసేవాడు. పై స్థాయికి చెందిన 'లీలావతి గణితం'లోని లెక్కలుకూడ అవలీలగా చేసేవాడు. ఆన్సరు రాగానే ఎగిరి గంతు వేసేవాడు.

అలాంటి వాడికి ఇంగ్లీషంటే భయం, అయిష్టం, ద్వేషం. ఇంగ్లీషులోకి బుర్ర పోనిచ్చేవాడుకాడు. స్కూలు ఫైనల్ పబ్లిక్ పరీక్ష మూడుసార్లు తప్పాడు. ప్రతిసారీ లెక్కల్లో నూటికి నూరువచ్చేవి. మిగతావాటిల్లోగూడ 60పైగా వచ్చేవి. ఇంగ్లీషులో మాత్రం 100కి 30 ఒకసారి, 29 ఒకసారి, 31 మరొకసారి వచ్చి తప్పాడు. మూడవసారి గూడ పేపర్లో నెంబరు కనిపించక పోయేసరికి అతని తండ్రి బావురుమని ఏడ్చాడు.

అందుచేత ఇష్టంకాని పాఠ్యాంశాలను సహితం ఇష్టమైనవిగా చేసుకోవాలి. మన ఇష్టాయిష్టాలు మన అభివృద్ధికి అడ్డంకి కారాదు. కొందరికి గణితమంటే అయిష్టం; మరికొందరికి ఇంగ్లీషంటే సరిపడదు. దాన్ని ఒక దయ్యం చూచినట్లు చూస్తారు. అంత మాత్రాన దాన్ని చదవకుండా తప్పించుకొనే వీలులేదు.

ఇష్టమైన పని ఇస్తే ఎవడైనా చేయగలడు. ఇష్టం కాని పనిగూడ చేసి సాధించాలి. "నీకు నచ్చిన పని నీకు లభించకపోతే లభ్యమైన పని నీకు నచ్చేటట్లు చేసుకో" అని ఇంగ్లీషులో ఒక సూక్తి వున్నది. (If you can not get the work you love, love the work you get).

చేసే పనిని ప్రేమిస్తే గాని ఆ పని సాధించలేము జీవితంలోవున్న సూత్రమిదే. ఒక పనిమీద ప్రేమ, ఆసక్తి వుంటే తప్ప దాన్ని సఫలీకృతం చేసుకోలేము.

కనుక పాఠ్యాంశాలను ప్రేమించాలి. కష్టమైన పాఠ్యాంశాలకు ఎక్కువ సమయం కేటాయించి చదవాలి. అంతేగాని సులభమైన వాటినే నిరంతరం చదువుతూ కూర్చోరాదు. ఈ పొరబాటు ఎక్కువమంది చేస్తుంటారు.

**d) దేనిమీదా నిర్లక్ష్యం పనికిరాదు.**

నిర్లక్ష్యం వలన కొందరు పరీక్షలు తప్పుతారు. ఒక పట్టణంలో పేరొందిన డాక్టరున్నాడు. ఆయన కొడుకును ఎం.బి.బి.ఎస్.లో చేర్పించాలనే ఉద్దేశ్యంతో ట్యూషన్లు పెట్టించి బాగా చదివించాడు. సైన్సులలో నూటికి 80, 90 మార్కులు వచ్చేవి. తీరా ఇంటర్మీడియేట్ పరీక్షలో తప్పాడు. దేంట్లో తప్పాడని విచారిస్తే తెలుగులో తప్పాడు!

మెడికల్, ఇంజనీరింగ్ సీట్లకొరకు చదివేవాళ్ళు ఫిజిక్సు, కెమిస్ట్రీ, ఇంగ్లీషు వగైరా వాటిమీద అత్యధిక శ్రద్ధ చూపుతారు. సమయమంతా వాటికే వెచ్చిస్తారు. తెలుగు మాతృభాషేగదా అనుకొని నిర్లక్ష్యం చేస్తారు. తీరా అందులో తప్పుతారు. అందుచేత ఏ సబ్జక్టుమీదా నిర్లక్ష్యం పనికిరాదు.

**ఛ) విజయకాంక్ష ఆవశ్యకత :**

ఏ పనిలోనైనా విజయం మనిషికి టానిక్కు వలె పని చేస్తుంది. అపజయం కృంగదీస్తుంది.

మనిషి మనస్సు చాల సున్నితమైనది. విజయం మనస్సుకు ఉత్సాహాన్ని కలిగిస్తుంది. అది మరికొన్ని విజయాలకు దారితీస్తుంది. అపజయం మనస్సును కృంగదీస్తుంది. అందు వలన తాను ఎందుకూ కొరగానివాడననే భావన కలుగుతుంది. తాను గడ్డి పోచకంటె హీనుడననే అభిప్రాయం ఏర్పడుతుంది. ఒక్కొక్కసారి అపజయం ఆత్మహత్యకుగూడ దారితీస్తుంది. అందుచేత మానవుడు అపజయాన్ని దరిజేర నివ్వగూడదు.

విద్యార్థి పరీక్ష తప్పితే తాను జీవితంలో ఏమీ సాధించలేననే నిరాశ కలుగుతుంది. స్నేహితులకు ముఖం చూపించలేడు. అతని కంటె అతని తల్లిదండ్రులు క్షోభ చెందుతారు. "రిజల్టు వచ్చినాయే. మీ అబ్బాయి పాసైనాడా?" అని ఎవరైనా అడిగితే చెప్పడానికి సిగ్గుపడతారు. తప్పాడు గనుక అంతటితో చదువు ఆపెయ్యమంటారు. కొడుకు పరీక్ష తప్పడం ఇంట్లో అందరికీ బాధాకరంగా వుంటుంది.

పరీక్ష ప్యాసైతే ఆత్మవిశ్వాసం వృద్ధి చెందుతుంది. ప్రపంచంలో ఏదైనా సాధించగలననే ధీమా ఏర్పడుతుంది.

తనకంటె తన తల్లిదండ్రులు ఎక్కువ ఆనందిస్తారు. అప్పు చేసైనాసరే కొడుకును పై చదువు చదివిస్తారు. విజయం వలన ఇంటిల్లిపాదీ ఆనందిస్తారు.

పరీక్ష ప్యాసై తీరాలి అనే బలమైన ఆకాంక్ష విద్యార్థిలో వుండాలి. తీవ్రమైన కోరికయే విజయం వైపు నడిపిస్తుంది. విందులు, వినోదాలు, సినిమాలు, సర్కసులు వగైరా ఆకర్షణలకు లొంగకుండా చదువు వైపు మనస్సు పెట్టి పనిచేయాలి.

## 2. విద్యార్థికి ఎదురయ్యే చిక్కు సమస్యలు :

పైన చెప్పినదోషాలను తొలగించుకొని విద్యార్థి చక్కగా చదవడానికి సంసిద్ధుడైనప్పటికీ అతడు మరికొన్ని ఇబ్బందులను ఎదుర్కొంటాడు. అవి ఇలావుంటాయి:

### a) చదివేటప్పుడు నిద్రవచ్చుట :

చాలామంది విద్యార్థులు రాత్రిభోజనంచేసి 8 గంటలకు చదువు ఆరంభిస్తారు. ఒక అరగంట కాగానే నిద్ర కళ్ళ మీాదకు వస్తుంది. వాటంతటవి కళ్ళు మూతలు పడుతాయి. 'రేపు' చదువుదాం లెమ్మని లైటు ఆర్పి పడుకుంటారు. మరునాడు మరల ఇదేకథ. నిద్రను ఆపుకోలేకపోతారు. ఇలాంటి "రేపు"లు ఎన్నో గడచిపోతాయి. చదువుసాగదు.

ఈ సమస్యను ఎదుర్కొనడం ఎలా? అనేది అందరినీ వేధించే చిక్కు ప్రశ్న.

విద్యార్థి రాత్రిపూట చదువుటకు ఇంగ్లీషు పాఠంగాని, తెలుగు పాఠంగాని తెరిస్తే నిద్రవస్తుంది. కాని లెక్కలు చేసినా, సైన్సు బొమ్మలు గీచినా, గ్రాఫు గీచినా, హోంవర్కు చేసినా నిద్రరాదు. ఇది అందరికీ అనుభవమే. ఎందువల్ల?

దీనికొక కారణమున్నది. చదివేటపుడు కళ్ళు, మనస్సు పనిచేస్తాయి. కొద్దిసేపటికి కళ్ళు మాత్రమే చూస్తుంటాయి. మనస్సు విశ్రాంతి తీసుకుంటుంది. నిద్రకు లొంగిపోతుంది.

కాని, వ్రాసేటపుడు కళ్ళు, మనస్సు మాత్రమేగాక చెయ్యి గూడ పనిచేస్తుంది. మనస్సు ఏమి వ్రాయాలో ఆజ్ఞాపిస్తే తప్ప చెయ్యి వ్రాయలేదు. అందుచేత మనస్సు విశ్రాంతి తీసుకొనే వీలులేదు. వ్రాస్తున్నంతసేపు మనస్సు అక్కడే వుండాలి. అందుచేత నిద్రకు వశంకాదు.

కనుక చదువుతోపాటు అందలి ముఖ్యాంశాలుగాని, కొన్ని విశేషాంశాలుగాని వ్రాస్తూవున్నట్లయితే నిద్రరాదు. తనంతటతాను నిద్రపోవాలను కున్నంతవరకు నిద్రరాకుండ ఆపవచ్చును. ఈ విధంగా విద్యార్థి రాత్రి 11-00 గంటల వరకు నిరాటంకంగా చదువుకొనవచ్చును.

విద్యార్థి ఎల్లప్పుడు "చదువుట మరియు వ్రాయుట" అనే పద్ధతి అవలంబించాలి. తద్వారా నిద్రరాకుండ చేసుకో వచ్చు. కొందరు రాత్రిపూట వ్రాయకూడదంటారు. అది పొరబాటు అభిప్రాయము. రాత్రిగూడ వ్రాసుకొనవచ్చును.

**b) చదివినది జ్ఞాపకముండక పోవుట :**

చదివినది గుర్తుండక పోవుటయే విద్యార్థుల ప్రధాన సమస్య. ఒక విషయం ఎందుకు జ్ఞాపకముంటుంది, ఎందుకు గుర్తుండదు అనే సంగతి కూలంకషంగా పరిశీలించాలి.

కొందరికి పాఠ్యభాగంలోని పద్యాలు ఎన్నిసార్లు చదివినా జ్ఞాపకముండవు. కాని సినిమా ఒక్కసారి చూచినా అందులో పాటలు గుర్తుంటాయి. సినిమాలో పాత్రల నడుమ సంభాషణలుగూడ గుర్తుంటాయి ఎందుచేత ?

"నీకు ఒక విషయంలో ఆసక్తి వున్నట్లయితే ఆ విషయం గుర్తుంటుంది." (If you are interested in a thing you will remember it) అని ఒక విద్యావేత్త అన్నారు. సినిమా మీద ఆసక్తి (interest) వున్నందున అందలి సంభాషణలు, పాటలు గుర్తుంటాయి. మన జీవితంలోగూడ ఆసక్తికరమైన మధురానుభూతులు, సంఘటనలు, సంభాషణలు ఎల్లకాలం గుర్తుంటాయి.

పాఠ్యభాగాలలో కూడ ఏఏ అంశాల మీద కుతూహలం మిక్కుటంగా వుంటుందో అట్టి అంశాలు తేలికగా గుర్తుం టాయి. చరిత్ర, కథ, నాటకం మున్నగునవి ఇష్టమైతే అవి చక్కగా గుర్తుంటాయి. వాటిలో ప్రశ్నలువస్తే అవలీలగా వ్రాయగలరు.

కాని, అన్ని పాఠ్యాంశాలు ఆసక్తికరంగా వుండవు. ఇంగ్లీషు, అర్థికశాస్త్రము, సైన్సు, గణితము మున్నగు వాటి మీద చాలమందికి ఆసక్తి వుండదు. మరి, అలాంటి పాఠ్య భాగాలు జ్ఞాపకముంచుకోవడం ఎలా ?

**ఎవరి స్వంత రచనలు వారికి గుర్తుంటాయి :**

ఒక పేరొందిన కవి సాయంకాలం ఆరుబయట పడుకొని తాను రచించిన పద్యాలను గొంతెత్తి పాడుతున్నాడు. పుస్తకం చూడకుండా, అక్షరం పొల్లుపోకుండా, పాతిక పైచిలుకు పద్యాలను ఏకధాటిగా చదువుతున్నాడు.

"అవి మీకు ఎలా జ్ఞాపకమున్నాయి?" అని ఎవరో అడిగారు.

"నా పద్యాలు నాకే జ్ఞాపకముండవా?" అని ఆయన సమాధానం.

ఆ సమాధానంలో చాలా అర్థంవున్నది. ఆ పద్యాలు ఎవరివో కావు. అవి తనవి; తాను రచించాడు. ఏ పద్యం

ఏ సందర్భంలో రచించాడో, ఏ శబ్దాన్ని ఏ అర్థంతో ప్రయోగించాడో ఆయనకు కరతలామలకం.

ఒక్కమాటలో చెప్పవలెనంటే, "ఆ పద్యం ఆయనది గనుక ఆయనకు జ్ఞాపకముంటుంది."

వస్తువుల సంగతి గూడ అంతే. తన స్వంతయింటికి ఎన్నికిటికీలున్నాయో, తన శరీరంలో ఎక్కడెక్కడ పుట్టుమచ్చలున్నాయో, తన బీరువాలో ఏఏ పుస్తకాలున్నాయో, తన పెన్ను పేరు ఏమిటో గుర్తుంటుంది. 'తనది' అయినవన్నీ గుర్తుంటాయి.

ఒక విద్యార్థి కాలేజి మ్యాగజైన్‌లో ప్రచురణకై నెల రోజులు కృషిచేసి ఒక పెద్దకథ వ్రాసి సంపాదకున కిచ్చాడు. ఆ సంపాదకుడు ఆ కథను ఎక్కడో జారవిడిచాడు. అది కనిపించలేదు. ఆ విద్యార్థిని మరల కథ వ్రాసి ఇవ్వమని కోరాడు. అతడు అదే కథను రెండు రోజులలోనే వ్రాసి యివ్వగలిగాడు. ఎలా ఇవ్వగలిగాడు? అతనికి ఆ కథ ఎలా గుర్తున్నది? ఆ కథ 'తనది' గనుక గుర్తున్నది రెండే రెండు రోజుల్లో మరల వ్రాసి యివ్వగలిగాడు.

పాఠాలు చదివేటప్పుడు గూడ విద్యార్థి ఆయా పాఠ్య భాగాలను కేవలం వారపత్రిక చదివినట్లు చదివి ఊరుకుంటున్నాడా? లేక వాటిని 'తనవి'గా చేసుకుంటున్నాడా?

ఇంగ్లీషు గాని తెలుగు గాని చరిత్రగాని సైన్సుగాని ఐదారుసార్లు చదువుతారు. కాని వాటిని తమవిగాచేసుకొనుటకు ప్రయత్నించరు. అందుకే అవి పొగరుమోతు గుర్రాల వలె స్వాధీనం కావు.

**చేతికి పనికలిగించడమే పాఠ్యాంశాన్ని తనదిగా చేసుకొనే మార్గం :**

ఒక పాఠాన్ని నోటితో చదువగానే తనకు వశంకాదు. చదివేటప్పుడు మనస్సు లోకసంచారం చేస్తూ వుంటుంది. కళ్లు, నోరు పుస్తకంమీద వున్నప్పటికీ మనస్సు పుస్తకం మీద వుండదు. మనస్సు పుస్తకం మీద వుంటే తప్ప పాఠ్యాంశం తనకు స్వాధీనం కాదు.

మనస్సును అక్కడ కట్టివేసివుంచే మార్గం ఏమిటంటే, చేతికి పనియివ్వడం. చేతితో వ్రాసేటప్పుడు మనస్సు ఫకీరు లాగ లోకసంచారం చేసే వీలులేదు. మనస్సు ఆజ్ఞాపిస్తేనే చెయ్యి వ్రాస్తుంది. ఆజ్ఞాపించవలెనంటే మనస్సు అక్కడే వుండితీరాలి. విషయాన్ని అర్థంచేసుకొని ఏమి వ్రాయాలో చేతిని పురమాయించాలి. అందుకై గొలుసుతో కట్టి వేసిన కుక్కమాదిరిగా మనస్సు ఆ విషయంమీదనే లగ్నమవుతుంది.

రోడ్డుమీద సినిమా రికార్డులు పెట్టినా చెవులకు వినిపించవు. ఇంట్లోకి చుట్టం వచ్చినా కనిపించదు. ఆకలి గూడ అనిపించదు.

వ్రాసేటపుడు మనస్సు అక్కడ ఉండడం ఒక్కటే గాదు. దీనివలన అనేక సత్ఫలితాలున్నాయి. వ్రాయడం వలన పాఠ్యభాగం 'తనది' అవుతుంది. మనం దేన్ని స్వహస్తూరితో, సొంత వాక్యాలతో వ్రాస్తామో అది మనది. దాన్ని మరచిపోము.

**c) పరీక్షహాలులో ఎదురయ్యే తత్తరపాటు :**

ఒక విద్యార్థి బాగా చదివి పరీక్షకు వెళ్ళాడు. అన్నీ చదివిన ప్రశ్నలే వచ్చాయి. కాని వ్రాయలేక పోయాడు. సగం సమయంకాగానే పేపరిచ్చి బయటికి వచ్చాడు. ఎందువల్ల వచ్చాడు? అన్నీ చదివినవే వచ్చినపుడు వ్రాయవచ్చు గదా ?

దీన్ని పరీక్షభయం (Examination fear) అని కొందరంటారు. కాని అది భయంకాదు. తాను రోజూ వెళ్ళేకాలేజిలోనే, రోజూ కూర్చొనే గదులలోనే పరీక్ష జరిగితే, తన అధ్యాపకులే వాచర్లుగా వస్తే, తాను బాగాచదివి పరీక్షకు పోతే, ఇంకా భయపడడమెందుకు? ఇది భయంకాదు. ఇది ఒక రకమైన 'తత్తరపాటు.' దీనికి వేరేకారణమున్నది.

పరీక్షను విశ్లేషించిచూస్తే అందులో రెండు విభాగములున్నాయి. 'Two-in-one' లాగ.

మొదటిది : ఇవ్వబడిన ప్రశ్నలకు సరియగు జవాబులు నీ బుర్రలో వున్నవా? అనగా అందుకు కావలసిన పరిజ్ఞానము (knowledge) నీకు గలదా ?

రెండవది : ఆ పరిజ్ఞానమును ఇవ్వబడిన సమయంలో వ్రాత పూర్వకముగా (in writing) కాగితము మీద పెట్టగలవా ?

విద్యార్థులు పరీక్షలకు సిద్ధమగునపుడు పై రెండు భాగములలో మొదటిదానికి మాత్రమే తయారగుచున్నారు. రాత్రింబవళ్ళు చదువుట ద్వారా, పాఠ్యభాగము గురించిన పరిజ్ఞానమును (Knowledge) పొందుచున్నారు. ఈ జ్ఞానము వారి మనస్సులలో సేకరించబడివున్నది. ఇది చాల ముఖ్యమైనపనే. సందేహము లేదు.

కాని, అంతటితో తమ పని పూర్తి అయినట్లు భావిస్తున్నారు. పరీక్షలో రెండవ విభాగమగు "నిర్ణీతసమయములో వ్రాత పూర్వకముగ విజ్ఞానమును కాగితముమీద పెట్టుట" అను దానికై కావలసిన కృషి చేయుటలేదు. ఇదే విద్యార్థులు చేయుచున్న పెద్దతప్పు.

**పరీక్షలు వ్రాత పూర్వకముగ జరుగుతాయి. వాటికై వ్రాతపూర్వకంగానే సిద్ధము కావాలి.**

అలా సిద్ధము కాకుండ పరీక్ష హాలులోకి వెళ్ళి చేతిని వ్రాయమని మనస్సు ఆజ్ఞాపిస్తే అది వ్రాయదు. "నాకు అల

వాటులేదు. ఇది వరకు నాచేత పీటిని వ్రాయించావా? ఇపుడు అకస్మాత్తుగా వ్రాయమంటే నేను ఎలా వ్రాయగలను? నాకు ఇందులో అనుభవంలేదు. కనుక వ్రాయలేను" అని మొరాయిస్తుంది చెయ్యి.

ఇలా మనస్సుకు చెయ్యి ఎదురు తిరుగుతుంది. నట్టు నట్టుగా తప్పులు వ్రాస్తుంది. దీనినే పరీక్షలభయం అని విద్యార్థులంటుంటారు. దీన్ని తొలగించుకోవలెనంటే చేతికి వ్రాయడంలో సంవత్సరం పొడవునా అలవాటు చేయాలి.

**చేతికి పని చెప్పడమే పరీక్షలలో విజయానికి మార్గం :**

ఏ పని అయినా మొదటిసారి చేసేటపుడు కష్టంగా వుంటుంది. రెండవసారి, మూడవసారి చేసేటపుడు తేలికగా వుంటుంది.

ఒక వ్యక్తి హైదరాబాద్‌లో బంధువుల యింటికి మొదటిసారి వెళ్లుటకు చాల శ్రమపడతాడు. రైలుస్టేషను నుండి ఏ నెంబరు బస్సు ఎక్కాలి, ఎక్కడ దిగాలి, ఏ వీధికి వెళ్లాలి, ఇంటి నెంబరు ఎక్కడ వెతకాలి? ఇలా ఎంతో శ్రమ పడతాడు. కాని రెండవసారి వెళ్ళినపుడు చాల సులభంగా నేరుగా ఇంటికి పోగలుగుతాడు.

మరొక ఉదాహరణ, గ్రామంలో ఎద్దులబండి ఉంటుంది. బండివాడు ఎవరినో ఎక్కించుకొని ఎడ్లను అదిలిస్తూ పోవలసిన వీధిలోకి తిప్పుతూ పొరుగూరు తీసుకుపోతాడు. కాని తిరిగి స్వగ్రామం చేరేటపుడు ఎద్దులకు మార్గం చెప్పనవసరం లేదు. బండివాడు జెల్లాలో పడుకొని నిద్రపోతూ వుంటే ఎద్దులు బండిని ఇంటికి తీసుకొనివస్తాయి.

అలాగే ప్రశ్నలకు జవాబులు వ్రాయడంలో చేతికి తర్ఫీదు ఇవ్వాలి. అలా యిచ్చినట్లయితే పరీక్షహాలులో అవలీలగా చెయ్యి వ్రాస్తూ పోతుంది. అప్పటికపుడు క్రొత్తగా వ్రాయమంటే వ్రాయలేక విఫలమవుతుంది.

పరీక్షలో ప్రశ్నలకు జవాబులు వ్రాయాలంటే వాటిని నిర్ణీతవ్యవధిలో పూర్తిచేయాలి. ఒకే ప్రశ్నకు గంటసేపూ వ్రాస్తూ కూర్చోగూడదు. కొన్నిటిని 15నిముషాలలో, కొన్నిటిని 5 నిముషాలలో, కొన్నిటిని 1 నిముషంలో వ్రాయగలగాలి. ఇంగ్లీషులో స్పెల్లింగు తప్పులుండగూడదు. దస్తూరి స్పష్టంగా అర్థమయేటట్లుండాలి. వ్యాసాన్ని పేరాగ్రాఫులుగా విభజించాలి. మధ్యలో ఉపశీర్షికలు పెట్టాలి. వాక్యనిర్మాణంలోను వ్యాకరణంలోను తప్పులుండగూడదు. అవసరమైన చోట్ల బొమ్మలు గీయాలి.

ఇవన్నీ కేవలం చదివితేను, కంఠస్థంచేస్తేనూ అలవడవు. వ్రాయుటలో అనుభవం పొందాలి. చేతికి నిరంతరం పని

చెప్పాలి. అపుడు మాత్రమే పరీక్ష హాలులో తత్తరపాటు (Examination fear) లేకుండా పోతుంది.

## విద్యార్థి చేయవలసిన పనులు:

విద్యార్థి పైన పేర్కొనబడిన ఐదు దోషములు తనలో లేకుండ జాగ్రత్త వహించాలి. అవి :

1) క్రింది తరగతిలో ఉండ వలసిన విద్యాస్థాయి లేకుండ పైతరగతికి వచ్చుట.

2) మార్కులు సాధించుటలో ఉన్నత లక్ష్యం లేక పోవుట.

3) కొన్ని సబ్జక్టులమీద అయిష్టము, ద్వేషము కలిగి యుండుట.

4) కొన్ని సబ్జక్టులు తేలికేగదా అని నిర్లక్ష్యముచేయుట.

5) ప్యాసుకావలెనని తీవ్రమైన కోరిక లేకపోవుట.

ఈ ఐదు లోపములు లేకుండ చూచుకోవాలి.

పిదప విద్యార్థి చక్కగా చదువుకొనడం ప్రారంభించి నపుడు అతడు మూడు చిక్కు సమస్యలను ఎదుర్కొంటాడు. అవి :

1) చదువునపుడు నిద్రవచ్చుట.

2) చదివినది జ్ఞాపకముండక పోవుట.

3) పరీక్ష హాలులో తత్తరపాటు (examination fear) కు లోనగుట.

ఈ మూడు సమస్యలను పరిష్కరించుకొనే మార్గాలను పైన వివరించడం జరిగింది. ఇక విద్యార్థి పరీక్షలలో అత్యుత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడగుటకు ఎట్లు తయారు కావలెనో తెలుసుకుందాము.

## 1. విద్యార్థి చేయువలసినది- "చదువుట మరియు వ్రాయుట"

ఒక పుస్తకాన్ని అందరు చదువుటకు, విద్యార్థి చదువుటకు తారతమ్యమున్నది. ఆ తేడాను విద్యార్థి శ్రద్ధతో గమనించాలి.

అందరూ పుస్తకాన్ని కాలక్షేపం కొరకు చదువుతారు. చదివిన పిదప మరచిపోతారు. అందులో ఏ విషయాన్నీ నోట్ చేసుకొనరు.

విద్యార్థి పుస్తకాన్ని పరీక్ష కొరకు చదువుతాడు. అందు పరీక్ష దృష్ట్యా అనేక అంశాలను జ్ఞప్తియందుంచుకోవాలి. కనుక ఇతడు చదివే పద్ధతిలో ఒక ప్రత్యేకత వున్నది. ఇది కేవలం చదవడం కాదు. 'చదువుట మరియు వ్రాయుట' అనే విధానాన్ని విద్యార్థి అనుసరించాలి. వ్రాయకుండా చదవడం మాత్రమే అతడు చేయకూడదు. (ఐతే, ఏమి వ్రాయాలి; ఎలా వ్రాయాలి అనే సంగతి ఇప్పుడు తెలుసుకోవాలి.

## 2. తానొక 'గ్రంథకర్త' కావాలి :

ప్రతి విద్యార్థి ఒక గ్రంథకర్తకావాలి. "మేము విద్యార్థులంగదా. మేము గ్రంథకర్తలంకాగలమా ?" అని విద్యార్థులు భయపడనవసరంలేదు. ఇది వరలో చెప్పినట్లు కవికి తన పద్యాలు ఎలాగుర్తుంటాయో, విద్యార్థికి గూడ తాను వ్రాసిన వాక్యాలు మాత్రమే పరీక్ష సమయంలో గుర్తుంటాయి. అందుచేత ప్రతి సబ్జక్టుమీద విద్యార్థి స్వయంగా ఒక పుస్తకం రచించాలి. వ్రాయలేనని భయపడ గూడదు. పరీక్ష హాలులో 10 లేక 20 పేజీల ఆన్సర్లు వ్రాస్తు న్నాముగదా. అదేరీతిలో పరీక్షలకు పూర్వమే ప్రతి సబ్జక్టు మీద రమారమి 150 పేజీల పుస్తకం వ్రాయాలి. '**వ్రాసి నది నాది. చదివినది నాదికాదు**' అనే సత్యాన్ని నిరంతరం గుర్తుచేసుకోవాలి.

## 3. తేలిక సబ్జక్టుతో రచన ప్రారంభించాలి :

కష్టమైన పాఠ్యాంశం (Subject)గాక తనకు తేలికైన పాఠ్యాంశం తీసుకొని రచన ప్రారంభించాలి. తెలుగు లేదా చరిత్రలో మొదటి పాఠాన్ని చదవాలి. దానికి సంబంధించిన గైడ్‌లోను, టీచరు చెప్పిన నోట్సులోను, ఆ పాఠంగురించిన విషయాలు వివరంగా చదవాలి.

పిదప పబ్లిక్ పరీక్షలో ఆ పాఠంలోంచి ఏ ఏ ప్రశ్నలు అడగడానికి వీలున్నదో వాటి అన్నిటికీ పుస్తకాలు దగ్గర

పెట్టుకొని ఆన్సర్లు వ్రాయాలి. పరీక్షహాలులో మాత్రమే చూచి వ్రాయగూడదు. అంతకు పూర్వం పుస్తకాలను దగ్గర పెట్టుకొని వ్రాయవచ్చు.

ఆ పాఠంలో 1. వ్యాసము 2. సందర్భసహిత వ్యాఖ్యలు, 3. పద్య ప్రతిపదార్థ తాత్పర్యములు, 4. పేరాగ్రాఫ్ ప్రశ్నలు, 5. వ్యాకరణము, ఛందస్సు - ఇలా ఏవేవి అవసరమగునో వాటి అన్నిటికీ పరీక్షహాలులో వ్రాసినట్లు అందంగా, తప్పులులేకుండా వ్రాయాలి. ప్రశ్నవ్రాసి దాని క్రింద జవాబు వ్రాయాలి.

తెలుగులో ఒక పాఠం ముగించిన పిదప చరిత్రో, సివిక్సో తీసుకోవాలి. అందులో మొదటి పాఠంలో రాదగిన ప్రశ్నలన్నిటికి వేరువేరు Note Books లో జవాబులు వ్రాయాలి. **Map pointing, Objective Type questions, Essays, short notes**వగైరా అన్ని రకాల ప్రశ్నలకు జవాబులు పరీక్షలో వ్రాసినట్లు వ్రాయాలి. ఇలా అన్నిటిలో మొదటి పాఠం పూర్తి అయిన పిదప చివరకు ఇంగ్లీషు తీసుకోవాలి.

## 4. ఇంగ్లీషుకు ప్రత్యేక ప్రాధాన్యం :

మిగతా సబ్జక్టులు తెలుగు మాధ్యమం (మీడియం)లో వుంటాయి గనుక ప్రతివిద్యార్థి స్వంత వాక్యాలతో ప్రశ్నోత్తరాలు వ్రాయగలడు. ఇంగ్లీషు అలాంటిదికాదు. ఇంగ్లీషులో

స్వంతంగా వాక్యం ఎక్కువమంది వ్రాయలేరు. తెలుగుకు ఇంగ్లీషుకు వాక్యనిర్మాణంలోనే చాలా తేడా వున్నది.

తెలుగులో కర్త, కర్మ, క్రియ వరుసగావస్తాయి. కాని ఇంగ్లీషులో కర్త తరువాత క్రియ, తరువాత కర్మవుంటాయి. 'నేను అతనిని చూచినాను' అనే వాక్యాన్ని ఇంగ్లీషులో 'I him saw' అని వ్రాయగూడదు. 'I saw him' అని వ్రాయాలి. అలాగే 'పుస్తకము పెట్టెలోవున్నది' 'Book the box in is' అని వ్రాయగూడదు. 'Book is in the box' అని వ్రాయాలి.ఇలా వాక్య నిర్మాణంలోనేగాక వ్యాకరణంలోను ప్రతి అంశంలోను తెలుగునకు ఇంగ్లీషుకు నడుమ ఎంతో తేడా వున్నందున విద్యార్థులకు ఆంగ్లంలో స్వయంగా వాక్యాలు వ్రాయడం అత్యంత కష్టమవుతుంది.

అందుచేత క్లాసులో ఇంగ్లీషు టీచరు డిక్టేట్ చేసిన నోట్సును కంఠస్థంచేసి విద్యార్థులు పరీక్షలు వ్రాస్తున్నారు. కొందరు నోటికిరాక ఇబ్బంది పడుతున్నారు. అందరూ ఒకే టీచరు చెప్పినదాన్ని అక్షరం మార్పులేకుండ వ్రాస్తున్నారు.

a) కంఠస్థంచేసే అలవాటు వున్నవారు టీచరు చెప్పిన Stories, essays మున్నగువాటిని కఠస్థంచేయాలి. కాని అంతటితో ఆగగూడదు. మరల వాటిని కాగితంమీద వ్రాయాలి. స్పెల్లింగు తప్పులుండగూడదు.

టీచరు చెప్పిన దాన్ని వ్రాసుకోవడంలో తప్పులు వ్రాసుకుంటారు. కనుక వ్రాసుకున్నదానిని కరెక్టు చేయించుకొని చదవాలి.

తాను చదివే ప్రతి ఇంగ్లీషు పదమునకు అర్థం తెలుసుకొని వుండాలి.అర్థం తెలియనిమాట ఉపయోగించకూడదు. కష్టమైన మాటబదులు సులభమైన పదాన్ని వాడాలి.

ఇంగ్లీషును తప్పులులేకుండా వ్రాయడం అలవరచుకోవాలి. అంతేగాని గంభీరమైన పదాలు వాడటం అనవసరం.

b) ఇంగ్లీషు కొరకుగూడ ఒక 150 పేజీలపుస్తకం పెట్టుకోవాలి. మొదటి పాఠం ముందు ప్రారంభించాలి. పరీక్షలో ఎన్నిరకాల ప్రశ్నలు ఆ పాఠంలో రావచ్చునో వాటి అన్నిటికీ జవాబులు వ్రాయాలి. టీచరు చెప్పిన ప్రశ్నోత్తరాలు, గైడ్‌లో వుండే జవాబులు చదివి వాటిని దగ్గర పెట్టుకొని విద్యార్థి తన పుస్తకంలో ప్రశ్నోత్తరాలు వ్రాయాలి. 1. Stories 2. Essays 3. Paragraph questions 4. Explain with reference to context 5. Transformation of sentences వగైరా అన్నిరకాల ప్రశ్నలకు జవాబులు వ్రాయాలి.

వ్రాసిన పిదప టీచరు ద్వారాగాని, మరొకరి ద్వారాగాని తాను వ్రాసిన వాటిలో తప్పులను దిద్దించుకోవాలి. పిదప వాటిని చదువుకోవాలి.

e) ఇంగ్లీషులో స్వయంగా వాక్యాలు వ్రాయడం తప్పక అలవరచుకోవాలి. ఎల్లకాలం కంఠస్థంచేసే పద్ధతిని అనుసరించే వీలుండదు. పైక్లాసులకు పోయినకొద్దీ వందలకొలది పేజీలుగల ఇంగ్లీషు పుస్తకాలను చదివి అర్థం చేసుకోవలసి వుంటుంది. క్రమంగా ఇంగ్లీషులో స్వయంగా వాక్యాలు, వ్యాసాలు వ్రాయడం నేర్చుకోవాలి. అందుకై క్రింది మార్గాలను అనుసరించాలి.

i) ఇంగ్లీషు గ్రామరు శ్రద్ధగా అర్థం చేసుకోవాలి. భూత, భవిష్యత్, వర్తమాన కాలములలో క్రియలు (verbs) ఏకవచన బహువచనములకు చెందిన కర్తలతో కలిసి ఎట్లా మార్పులు చెందుతాయో తెలుసుకోవాలి.

ii) **Active voice, passive voice** లలో వాక్యాలు ఎలా మార్పు చెందుతాయో, **Positive, Comparative, Superlative degrees** లో వాక్యాలు ఎట్టి మార్పులు చెందుతాయో గ్రహించాలి. **simple, complex, compound sentences**లను ఎలా ఒకదానిని మరొకటిగా మార్చవచ్చునో తెలుసుకోవాలి.

iii) మాతృభాషనుండి వాక్యాలను ఇంగ్లీషులోకి తర్జుమా చేయడం మంచి పద్ధతి. అలాచేస్తే ఇంగ్లీషులో వాక్య రచన అలవడుతుంది.

iv) ఇంగ్లీషులో General study చేస్తూ వుండాలి. ఇంగ్లీషు పాఠ్యభాగం మాత్రమే చదివి ఊరుకోనక తనకు నచ్చిన ఆంగ్ల దినపత్రికలో వార్తలు, ఇష్టమైన ఇంగ్లీషు కథానికలు, నవలలు చదువవచ్చు. రేడియో లోను, టి. వి. లోను ఇంగ్లీషు వార్తలు వినడం వలన ఇంగ్లీషు ఉచ్చారణ తెలుస్తుంది.

## 5. స్వంత నోట్సులతయారి

పైనచెప్పిన విధంగా ఒక్కొక్క సబ్జక్టులో మొదటి పాఠం చొప్పున అన్ని సబ్జక్టులను పూర్తి చేసిన పిదప మరల మొదటి సబ్జక్టుల్లో రెండవ పాఠాన్ని తీసుకోవాలి. ఇలా అన్ని సబ్జక్టులలో అన్నిపాఠాలు గురించిన ప్రశ్నోత్తరాలు వ్రాయడం క్రమంగా పూర్తిచేయాలి.

50 శాతం పాఠాలు వ్రాయడం పూర్తికాగానే విద్యార్థికి ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. పాఠాలమీద ఆధిపత్యం లభిస్తుంది. ఇలా పాఠ్యభాగాలలో 90 శాతం సిలబస్‌కు ప్రశ్నోత్తరాలు వ్రాయాలి. 10 శాతం సిలబస్ వదలి పెట్టినా ఫరవాలేదు.

ఎఱ్ఱసీరాకలం తప్పక కలిగియుండాలి. దానితో ప్రశ్నోత్తరాలలో ముఖ్యమైన మాటలను, వాక్యాలను అవసరమైన చోట్ల under line చేయాలి. పరీక్షకు పోబోయే ముందురోజున ఇలా under line చేసిన వాక్యాలను పదాలను కంటితో చూచుకుంటూ పేజీలు త్రిప్పాలి. అంతేగాని అన్ని పేజీలు చదివే అవసరం ఉండగూడదు.

## 6. పరీక్షల ముందు చేయవలసినపని :

ఎంతో చక్కగా చదివి ఎంతో బాగా వ్రాసినప్పటికీ పరీక్షలో 80 మార్కులు వస్తాయనుకుంటే 50 మార్కులే వచ్చాయని విద్యార్థి చింతిస్తాడు. పేపర్లు సరిగా దిద్దలేదని భావిస్తాడు. ఇలా తక్కువ మార్కులు రావడానికి కారణమున్నది.

ఒక వస్త్రము ఎంత పొడవున్నదో కొలవాలంటే సామాన్య వ్యక్తి తన మూరతో కొలచి పదిమీటర్లున్నదంటాడు. ఇది ఉజ్జాయింపు కొలత మాత్రమే. ఆ తరువాత మీటరుబద్ద తెచ్చి కొలిస్తే తొమ్మిది మీటర్లే ఉంటుంది. అది సరైన కొలత.

అలాగే తాను వ్రాసిన వాటికి తాను విలువకడితే 80 మార్కులు వస్తాయి. అది ఉజ్జాయింపు కొలత. దానిని పరీక్షాధికారులు లెక్కగడితే 50 మార్కులే రావచ్చు.

కనుక విద్యార్థికిగల విజ్ఞానాన్ని పబ్లిక్ పరీక్షాధికారుల కొలబద్దతో కొలవాలి. ఆ కొలబద్ద లేవి? అవి ఇదివరకటి

పరీక్షా పత్రాలు. వాటిని తెచ్చుకొని ఆన్సరు చేస్తే విద్యార్థి తన విజ్ఞానాన్ని పరీక్షాధికారుల కొలబద్ద స్థాయికి సమానంగా తీసుకుపోగలుగుతాడు.

అందుచేత మార్చి 1వ తేదీ నుండి చేయవలసిన పని ఏమంటే, ప్రతి సబ్జక్టులోనూ ఇదివరకటి సంవత్సరాలలో ఇవ్వబడిన ఏవైన మూడేసి పబ్లిక్ పరీక్షా పత్రాలను మేష్టరు గారి నడిగిగాని, గ్రంథాలయాధికారి నడిగిగాని తీసుకొని వాటిని కాపీచేసుకోవాలి. వాటికి Choice వదలకుండా అందు ఇవ్వబడిన అన్ని ప్రశ్నలకూ పూర్తి జవాబులు వ్రాయాలి. వీలైనంతవరకు పుస్తకాలు చూడకుండా వ్రాయాలి. తెలియనపుడు పుస్తకాలు చూచి వ్రాయవచ్చు.

ఇలా ఒక్కొక్క సబ్జక్టులో మూడు (కనీసం రెండు) ప్రశ్నపత్రాలు చొప్పున అన్ని సబ్జక్టులలోను ఆన్సరు చేయడానికి 75 గంటలు పట్టవచ్చు. రోజుకొక ప్రశ్న పత్రం చొప్పున చేసినా 15 రోజులలో అన్నిటినీ ఆన్సరు చేయవచ్చు.

వీటిని ఆన్సరు చేయడం ఎంత ముఖ్యమో మాటలతో వర్ణించలేము. అలా చేయటంవలన విద్యార్థి పరిపూర్ణదశనందుకుంటాడు. అతనిని నిద్రపోవుచుండగా లేపి పరీక్ష వ్రాయమన్నా వ్రాయగలుగుతాడు. అతనికి అన్ని ఆన్సర్లూ కరతలా

మలకంగా వుంటాయి. ఒకవేళ అతని శత్రువువచ్చి పేపర్లు దిద్దినా అతన్ని తప్పించలేము. రేపు సూర్యోదయమగుట ఎంత నిశ్చయమో అతను ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణుడగుట అంత నిశ్చయం.

## 6. పరీక్షహాలులో చేయవలసిన పని :

పరీక్షహాలు విద్యార్థికి విజయక్షేత్రం. పైవిధముగా సిద్ధమైన విద్యార్థి నల్లేరుమీద బండివలె నిరాఘాటంగా ఆత్మ విశ్వాసంతో పరీక్షలకు వెళుతాడు. అపుడుగూడ కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

a) పరీక్షకు ముందురోజున టీ త్రాగుతూ రాత్రల్లా మేలుకొని కొందరు చదువుతుంటారు. తెల్లవారు జాము నాలుగు గంటలదాకా చదువుతూనేవుంటారు. అలాంటివాళ్ళు పైత్యంవలన పరీక్షహాలుతో పడిపోవ డం జరుగవచ్చు. చదవినవి గుర్తుండవు కూడాను. ఎట్టి స్థితిలోనూ రాత్రి 12 తరువాత మేలుకొని వుండ రాదు. కనీసం 5 గంటల పాటు నిద్రపోవాలి.

b) పరీక్ష టైంటేబుల్ పారవేసుకోనకుండా దగ్గర పెట్టు కోవాలి. హాల్‌టికెట్టు మరచిపోగూడదు. ఏ పరీక్ష ఏరోజున ఎపుడు జరుగునో గ్రహించి దాని ప్రకారం పరీక్షకు వెళ్ళాలి. పరీక్ష ఒక సబ్జక్టులో అయితే మరొక సబ్జక్టు చదివి పరీక్షకు పోగూడదు.

ఏ ప్రశ్నలకు ఎన్ని మార్కులో చూచి దామాషా ప్రకారము ఆ ప్రశ్నకు ఎంత టైములో జవాబు వ్రాయాలో నిర్ణయించుకొని ఆ వ్యవధిలో జవాబు పూర్తిచేయాలి. ఒక ప్రశ్నకే ఎక్కువ టైము తీసుకో కూడదు. అప్పుడు మిగతా ప్రశ్నలు వ్రాయడానికి సమయం చాలదు.

అన్సరు తృప్తికరంగా వ్రాసినా వ్రాయకపోయినా అన్ని ప్రశ్నలకు (Choice మినహాయించుకొని) జవాబులు వ్రాయాలి.

పరీక్ష కొరకు ఏ 100 ప్రశ్నలో చదువుకొని వెళ్ళి నప్పటికీ అక్కడ ఏ 20 ప్రశ్నలో వ్రాయవలసి వస్తుంది. మిగతా 80 ప్రశ్నల అన్సర్లు మనస్సులో వుండకుండ తెరమరుగునకు పోవాలి. కావలసిన 20 ప్రశ్నల జవాబులమీదనే మనస్సును కేంద్రీకరించాలి. వాటిలోగూడ ఏ ప్రశ్నకు జవాబు వ్రాస్తున్నామో దానిమీదనే చీకట్లో టార్చిలైటు వేసినట్లు మనస్సు పనిచేయాలి. ఇలా మనస్సు ఆయా అంశాల మీద ఒకదాని తర్వాత మరొక దానిపై కేంద్రీకరించి సమాచారాన్ని చేతిద్వారా వ్రాయించే ఆశ్చర్యకరమైన శక్తికి 'ఏకాగ్రత' అని పేరు. ఈ ఏకాగ్రత వలననే మనుష్యుడు విజయాలనుసాధిస్తాడు.

## 7. మనో ఏకాగ్రత సాధించే మార్గాలు :

పరీక్షలలో అత్యుత్తమ ఫలితాలను సాధించుటకు మానసిక ఏకాగ్రత అత్యవసరం. వ్రాయునపుడు మనస్సు ఒకేచోట లగ్నమైయుంటుంది. అందుచేత ఏకాగ్రత సాధించుటకు అదొక మంచిమార్గము. ఇందుకు ఈ క్రింది పద్ధతులు కూడ ఉపకరిస్తాయి.

i) తలమీద చన్నీటిస్నానం చేయడం, అదికూడ సూర్యోదయానికి పూర్వం చేయడం విద్యార్థులకు ప్రయోజనకరం.

ii) ప్రతి వ్యక్తికీ ఆహారం కావాలి. అన్నం తినకుండా నెల రోజులకంటె ఉండలేము. అన్నంకంటె నీరు ఎక్కువ అవసరం. నీరు త్రాగకుండా కొలదిరోజులు కూడ ఉండలేము. నీటికంటె గాలి మిక్కిలి అవసరం. గాలి పీల్చకుండా కొలది సెకండ్లు కూడ ఉండలేము. 8

కనుక అత్యధికంగా గాలిపీల్చడానికై ఆటలాడాలి. ప్రతి దినం ఒకమైలు పరుగెత్తితే శరీరం ఎక్కువ గాలి తీస్కుకుంటుంది. పరిశుభ్రమైన గాలివలన మనస్సు చురుకుగా పని చేస్తుంది.

iii) మహర్షులు మనకొసగిన అమూల్యమైన సంపద యోగాసనములు శరీరమును ఆరోగ్యవంతముగా

నుంచుటకు, వ్యాధులను నివారించుటకు, మనస్సును ఉద్రేకములనుండి దూరముచేసి ప్రశాంతముగానుంచుటకు, యోగాసనములు అత్యంత ప్రయోజనకరమైనవి.

వాటిలోకెల్లా "సర్వాంగాసనము" విద్యార్థులు తప్పక అభ్యసింపవలసినది. దానివలన వీర్యశక్తి కాపాడబడుతుంది. జ్ఞాపకశక్తి పెంపొందుతుంది. ఎవరనైనా తెలిసిన వారినడిగి విద్యార్థి ప్రతిదినము ఒకటి రెండు నిముషములపాటు సర్వాంగాసనమును వేయాలి. దానితోబాటు హలాసనము, పశ్చిమోత్తాసనము, శవాసనములనుగూడ రెండేసి నిముషములపాటు వేయాలి.

'సర్వాంగాసనము' విద్యార్థులకు వెలగట్టలేని టానిక్కువలె పనిచేస్తుంది. మనోఏకాగ్రతకు, జ్ఞాపకశక్తి పెంపుదలకు మిక్కిలి ఉపకరిస్తుంది. ఇది నూటికి నూరుపాళ్ళు సత్యము.

## 8. విద్యార్థులు అములుపరచవలసిన మరికొన్ని అంశములు:

### a) చదువులో పోటీలు :

జీవితంలో ధనముకొరకుగాని, పదవికొరకుగాని, సంపాదన కొరకుగాని పరస్పరము పోటీపడడం వలన వ్యక్తులలోనూ అసూయ, మాత్సర్యము, ఓర్వలేనితనము ఏర్పడుతాయి. కాని విద్యలో పోటీపడడం వలన జ్ఞానము పెంపొందుతుంది.

వ్యక్తులనడుమ పరస్పరగౌరవము ఏర్పడుతుంది. అందుకే "పూనుస్పర్ధలు విద్యలందే" అని గురజాడ అప్పారావుగారు వ్రాశారు.

ఒక హైస్కూలులో ప్రతి సంవత్సరం 10వ తరగతిలో నూటికి నూరుమంది ప్యాసవుతుంటారు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుని కలుసుకొని "మీ హైస్కూలులో 100కి 100మంది ప్రతి సంవత్సరం ప్యాసవడంలో గల రహస్య మేమిటి ? అందరూ అంత బాగా ఎలా చదువుతున్నారు?" అని ప్రశ్నించగా వారిలా చెప్పారు.

"ఏమీ లేదండి. చదువులో పోటీలు పెడతాను. దాని వలన వాళ్ళు బాగా చదివి ప్యాసవుతున్నారు" అన్నాడు.

"మీరు ఏఏ విషయాల్లో ఎలా పోటీలు నిర్వహిస్తారు? ఆటలపోటీలు నడపడం అందరూ చేయగలరు. కాని చదువులో పోటీలు నడపడం ఎలా? ఈ రహస్యం కాస్త వివరించండి!" అన్నాను.

అందుకు వారిలా వివరించారు: "మొదట క్లాసులోని పిల్లలందరూ ఇద్దరిద్దరు చొప్పున జట్లుగా ఏర్పడుతారు. మంచి స్నేహితులైనవారు ఒకే జట్టుగా వుంటారు. మొత్తం తరగ

తిలో షుమారు 15 లేక 20 జట్లు ఏర్పడుతాయి. జట్లలో లేనివారు విడిగా కూర్చొని వింటుంటారు.

సబ్జక్టు టీచరు, లేదా ప్రధానోపాధ్యాయుడు న్యాయమూర్తిగా వ్యవహరిస్తాడు.ఆయన కేవలం కుర్చీలోకూర్చొని పోటీ నిర్వహిస్తూ బోర్డుమీద జట్టుల నెంబర్లు వేసి వారికివచ్చిన మార్కులు వేస్తుంటాడు. అతడు ఏ మీ ప్రశ్నలు అడగడు. క్విజ్ నడిపినట్లు నడుపుతుంటాడు.

అన్ని జట్టులు గుండ్రంగా కూర్చుంటాయి. మొదటి జట్టు నాయకుడు ఒక ప్రశ్న అడుగుతాడు. దానికి 2వ జట్టు జవాబు చెప్పాలి. చెప్పలేకపోతే తరువాత జట్టులకు వరుసగా ప్రశ్న వెళుతుంది. ఏ జట్టు చెపితే వారికి మార్కు వస్తుంది. ఎవ్వరూ చెప్పలేకపోతే అడిగిన జట్టు జవాబు చెప్పి మార్కు పొందుతుంది.

సాధారణంగా ఒక్క పదములో చెప్పే జవాబులు, ఒక్క వాక్యంలో చెప్పే జవాబులు అడగాలి. ఒకవేళ కంఠస్థము చేయదగిన పద్యాలు, నాలుగైదు వాక్యాలుగల జవాబులు రాబట్టుటకై ప్రశ్నలు అడిగితే వాటికి ఎక్కువ మార్కులు కేటాయించాలి. ఇంగ్లీషులో Transformation of sentences, spellings, recitation వగైరా అడగవచ్చు. తెలుగులో అలంకారములు, ఛందస్సు, పద్యములు అడగవచ్చు. ఏప సబ్జక్టులలో ఎటువంటి ప్రశ్నలు అడగవచ్చునో ఉపా

ధ్యాయుడు ముందుగా నిర్ణయించాలి. ప్రశ్నలు అడిగే వారికి సమాధానాలు తెలిసివుండాలి.

ఇలా ప్రతి జట్టులోని విద్యార్థులు గెలుపొందడం కొరకై సులభమైనవేగాక అత్యంత కష్టమైన ప్రశ్నలు-జవాబులుగూడ చదువుకొని వస్తారు. ఎవరూ చెప్పలేని ప్రశ్నలకు విడిగా కూర్చున్న విద్యార్థులు జవాబులు చెప్ప వచ్చు. వారుగూడ చెప్పలేనపుడు ప్రశ్న అడిగిన జట్టులోని వారు చెపుతారు.

గెలుపొందిన మూడుటీములకు హైస్కూలు తరపున తప్పనిసరిగా విలువైన బహుమతులందచేయాలి. పాల్గొన్న వారందరికీ బాల్ పెన్సిళ్ళు ఇవ్వాలి. అపుడే వారిలో పట్టు దల ఏర్పడుతుంది. ప్రతి సబ్జక్టుకు ఒకసారి, రెండు సార్లు ఫిబ్రవరి నెలలో ఇలా పోటీలు నిర్వహిస్తాము. ఈ పోటీలు కారణంగా మా హైస్కూలులో 100 శాతం విద్యార్థులు ఉత్తమశ్రేణిలో ప్యాసవుతున్నారు".

ఆ ప్రధానోపాధ్యాయుడు చేసినట్లు ప్రతి విద్యాల యంలోను ఇట్టిపోటీలు నిర్వహించి సత్ఫలితాలుపొందవచ్చు.

**b) విద్యార్థులు కొనవలసిన మంచి పుస్తకాలు :**

విద్యార్థులు ఇంగ్లీషులోను, తెలుగులోను చక్కని రచన అలవరచుకోడానికి ఈ క్రింది పుస్తకాలు వారికి అవ సరమవుతాయి,

1. విద్యార్థి ఇంగ్లీషులో వాక్యం వ్రాయాలంటే మొదట మాతృభాషలో ఆలోచిస్తాడు. తెలుగులో ఒక వాక్యం అనుకుంటాడు. దాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేయడం కొరకు ప్రయత్నిస్తాడు. కొన్ని తెలుగు పదాలకు ఇంగ్లీషు తెలియదు. అప్పుడు అతనికి కావలసినది తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు.

"ఎమెస్కో పాకెట్ తెలుగు ఇంగ్లీషు డిక్షనరీ" వున్నది. దాని వెల రు. 12-00 మాత్రమే! దీనిని శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు సంకలనం చేశారు. ఎం. శేషాచలం అండ్ కో వారు ప్రచురించారు. ఇంగ్లీషులో వాక్యరచనకు ఇది మిగుల ఉపయోగకరం.

2. ఇంగ్లీషులో Roget's Pocket Thesaurus అనే పుస్తకం వున్నది. అందులో ఆంగ్లపదములకు సమానమైన అర్థమిచ్చెడి మాటలన్నీ ఒకచోట కూర్చబడి వున్నాయి. ఒకదానికి సమాన అర్థాలిచ్చే నామవాచకాలు, క్రియలు, విశేషణాలు, క్రియావిశేషణాలు కూడా ఒకే చోట పేర్కొనబడుతాయి. అలా వుండడం వలన వ్యాసం వ్రాసే విద్యార్థి కావలసిన పదాన్ని తేలికగా వాటినుండి ఎంచుకోగలుగుతాడు. ఉదాహరణకు Advise అనే క్రియయొక్క పర్యాయ పదాలను (Synonyms) ఇలా పేర్కొన్నారు:

**Advise, counsel, suggest, prompt, recommend, prescribe, advocate, exhort, persuade.**

పీటినేగాక అడ్వైజ్ శీర్షిక క్రింద **Advice, instruction, adviser, consultation** అనే సమానార్థకమైన నామవాచకాలకు కూడ **Synonyms** అంటునే ఇచ్చారు.

ఇంగ్లీషులో వ్యాసరచనచేయడానికి ఈ పుస్తకం చాల ఉపయోగకరం. అన్ని పెద్దషాపులలోను దొరుకుతుంది. వెల 50 రూపాయలు.

3. ఐతే ఇలాంటి పుస్తకం తెలుగులో ఒకటివున్నది. అది విద్వాన్ శ్రీ ముసునూరి వేంకటశాస్త్రిగారు రచించిన “విద్యార్థి కల్పతరువు”. అను ఆంధ్రభాషా విషయ సర్వస్వము. దీనిని వేంకట్రామా అండ్ కోవారు ప్రచురించారు. వెల 40 రూపాయలు.

[illegible] విద్యార్థి శబ్దాలను ఎంచుకొని రచన సాగించడానికి ఈ గ్రంథము కల్పతరువువలె ఉపకరిస్తుంది. ఉదాహరణకు కొన్ని శబ్దాల పర్యాయపదాలివి.

[illegible] రాత్రి, నిశ, నిశీథి, రజని, యామిని, తమి, శర్వరి, అసుర[illegible], [illegible], దోషా, రాతిరి, త్రియామా, క్షణదా, తమ.

[illegible] సతతము, ఎల్లప్పుడు, సదా, అనవరతము, నిరతము, అజస్రము. [illegible]

ఈ గ్రంథములో మరొక ప్రధానమైన విభాగము వ్యుత్పత్త్యర్థములు. ఒక పదము యొక్క వ్యుత్పత్తి తెలుసు కుంటే తప్ప దానిని సరియగు అర్థముతో ప్రయోగించ లేము. అట్లే కొన్ని తెలుగు జాతీయములు, సంస్కృత జాతీ యములు అర్థములతో సహా ఇందు పేర్కొనబడినవి. తెలుగులో వ్యాసరచన చేయుటకిది మిగుల ప్రయోజనకర మైన గ్రంథము.

పైమూడు గ్రంథములు ప్రతి విద్యార్థికి అత్యంత అవ సరములు. వీటితో బాటు ఇంగ్లీషు-తెలుగు నిఘంటువును, తెలుగు-తెలుగు నిఘంటువును కలిగియుండాలి.

**౬. ఇంగ్లీషులో, తెలుగులో తప్పొప్పుల పట్టికలు తయారు చేయుట.**

విద్యార్థి భాషలో దోషములు లేకుండ ఇంగ్లీషు, తెలుగు వాక్యములను వ్రాయాలి. వ్యాకరణరీత్యాగాని స్పెల్లింగులోగాని తప్పులుండరాదు. భాషా నియమములను తెలుసుకొని వాటి ప్రకారము ఏది తప్పో, ఏది ఒప్పొ గ్రహిం చాలి. ఆ విధంగా గ్రహించిన రీతిలో తెలుగు, ఆంగ్లభాష లలో నిరంతరము తప్పొప్పుల పట్టిక సిద్ధము చేసుకొంటూ ఆ తప్పులను మున్ముందు చేయకుండ ఉండాలి. ఉదా హరణకు ఆ పట్టిక ఇట్లుండవచ్చును.

| తప్పు | ఒప్పు |
| --- | --- |
| విధ్యార్థి | విద్యార్థి |
| పుస్తుకము | పుస్తకము |
| బేధము | భేదము |
| వాడు యింటికివచ్చెను | వాడింటికివచ్చెను |
| భాద | బాధ |
| నిదానమే ప్రదానము | నిదానమే ప్రధానము |
| భావిలోపడెను | బావిలోపడెను |
| మధుసూధనరావు | మధుసూదనరావు |
| క్రిష్ణుడు | కృష్ణుడు |

| WRONG | RIGHT |
| --- | --- |
| Birds flies | Birds fly |
| Boy come | boy comes |
| Man walking | man is walking |
| Solger | Soldier |
| Humor | Humour |
| Bus depo | Bus depot |
| Tee | Tea |
| Jermany | Germany |

## d) సద్బుద్ధి ఆవశ్యకత

ఇంత కృషిచేసినప్పటికీ, ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నప్పటికి ఎంతో శ్రద్ధగా చదివినప్పటికీ, 'బుద్ధి' వక్రించినట్లయితే ఇదంతా బూడిదలోపోసిన పన్నీరవుతుంది. దుస్సాంగత్యం వలన, మానసిక బలహీనతల వలన విద్యార్థి వ్యసనాలకు లోనుకావచ్చు. మాదకద్రవ్యాలు, త్రాగుడు, జూదము, వగైరా దురలవాట్లకు పాల్పడవచ్చు. సూత్రం తప్పువేసుకొని ఎంతసేపు లెక్కచేసినా ఆన్సరురానట్లు బుద్ధి పెడమార్గానపోతే మనస్సు, శరీరము చెడునడతే నడుస్తాయి. ముఖ్యంగా తల్లిదండ్రులకు దూరంగా పట్టణాలలోవుంటూ గదులు అద్దెకుతీసుకొని నివసించే విద్యార్థులకు ఈ ప్రమాదం కలగడానికి అవకాశం ఎక్కువగా వుంటుంది. ఎందరో మెడికల్ సీట్లువచ్చి పట్టణాలకు వెళ్ళి చదువుకొనే ప్రతిభగల విద్యార్థులు తమ చదువులను వ్యసనాల వలన చెడగొట్టుకొని జీవితంలో పనికిరాకుండా పోయారు. ఇది కఠోరసత్యం.

దీనికి పరిష్కారం ఏమిటంటే సద్బుద్ధి పెంచుకోవడం. అందుకై సత్సాంగత్యం కలిగియుండడం; అంతేగాక "హే భగవాన్! నాకు సద్బుద్ధి ప్రసాదించు! అని ఈ సృష్టిని నడిపిస్తున్న దివ్యశక్తిని మనసారా ప్రార్థించడం; తనకిష్టమైన దేవుని అనుదినం స్మరించడం. దేవుని ప్రార్థించడానికి నామోషిపడకూడదు. మహాత్మాగాంధీ లోకమాన్య

తిలక్, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, డా॥ సూరిభగవంతం లాంటి మహా నీయులు దైవప్రార్థన ద్వారానే క్లిష్టపరిస్థితులను అధిగమించ గలిగారు. దేవుని అనుగ్రహం వలన బుద్ధి సన్మార్గంలోకి వస్తుంది.

## 9. జీవితం కొరకు విద్య :

విద్య అనేది కేవలం పరీక్షల కొరకు కాదు. అది జీవితం కొరకు. ఉన్నత శ్రేణిలో పరీక్షలు ప్యాసు కావడం అవస రమే. అంతకంటె కూడా జీవితానికి వెలుగుబాటగా విద్య ఉపయోగపడాలి.

"బోధన బడితో ఆఖరు; విద్యార్జన జీవితంతోనే ఆఖరు" అని ఒక విద్యావేత్త చెప్పినాడు. ఉపాధ్యాయుడు బోధించుట మాత్రమే పడితో ఆఖరవుతుంది. విద్యను ఆర్జిం చడమనేది జీవితాంతం కొనసాగించాలి.

విద్య అనగా జ్ఞానము. అదియొక వెలుగు వంటిది. అది మనస్సులోని అంధకారాన్ని తొలగిస్తుంది. జీవితానికి మార్గదర్శనం చేస్తుంది.

కేవలం పాఠశాలల్లో చదివే పాఠాలనుండే గాక అను భవమువలన జ్ఞానం లభిస్తుంది. 'అనుభవం జ్ఞానానికి జనకుడు' అని అందుకే చెప్పారు. సత్సాంగత్యమువలన, సద్గ్రంధ పఠనమువలన, లోకాన్ని పరిశీలించుటవలన, జరిగిన విష యాల నుండి గుణపాఠాలు గ్రహించుటవలన, జ్ఞానం లభి స్తుంది. ఎప్పుడు మంచి విషయాన్ని చదివినా, విన్నా,

తెలుసుకున్నా దానిని ప్రత్యేకమైన నోటు పుస్తకంలో వ్రాసుకోవాలి. ఈ పని నిరంతరం చేస్తూవుండాలి.

"మాట్లాట నేరిస్తే పోట్లాట ఉండదు" అని సామెత. చక్కగా, మృదువుగా మాట్లాడితే కలహాలుండవని బోధిస్తున్నదీ వాక్యం.

మానవుడు ఎలా జీవించాలి అనే విషయాన్ని తుమ్మల సీతారామమూర్తిగారు ఈ చిన్న పద్యంలో చెప్పారు.

"సూది వోలె బ్రదుకరాదు, దారమునట్లు
మనుట నేర్వవలయు మానవుండు
సూది తూట్లు వేయుచుంబోవు, దార మా
రంధ్రములను గప్పి రాణ చెందు"

మానవుడు సూదివలె జీవించక దారమువలె జీవించాలి. ఎందుకంటే సూది తూట్లువేస్తూ రంధ్రములను చేస్తూ వుంటుంది; దారము ఆ రంధ్రములను కప్పివేస్తూ పువ్వులను ఒక మాలగా తయారుచేస్తుంది !

"స్నేహము దుఃఖాన్ని భాగిస్తుంది; ఆనందాన్ని హెచ్చిస్తుంది" అని ఒక ఆంగ్ల సామెత. స్నేహితుల సమక్షంలో దుఃఖం ఉపశమిస్తుంది; సంతోషం ఇనుమడిస్తుంది. ఈ సామెత స్నేహంయొక్క ప్రయోజనాన్ని పేర్కొన్నది.

"బలమే జీవనము, బలహీనతే మరణము" అని స్వామి వివేకానందుడు ఉద్బోధించాడు. కనుక ప్రతివ్యక్తీ శారీరక

బలమును ఆరోగ్యమును పదిలపరచుకోవాలి. బలవంతునికి. లోకం తలవంచుతుంది; బలహీనుని అణగద్రొక్కాలని చూస్తారు.

ఇలా జీవితానికి వెలుగుబాటలుగా ఉపకరించే సందేశాలను, సూక్తులను, సన్నివేశాలను, హెచ్చరికలను విద్యార్థి నిరంతరం సేకరించుకుంటూ ఉండాలి. అదే నిజమైన విద్య.

## 10. విజయానికి మార్గం :

జీవితంలో విజయసాధనకు మార్గమేమిటి ? అనే ప్రశ్నకు ప్రఖ్యాత విజ్ఞాన శాస్త్రవేత్త ఆల్‌బర్ట్ ఐన్‌స్టీన్ మహాశయుడు జవాబు యిలా ఒక సూత్రంలో యిమిడ్చాడు:

$A = X + Y + Z$

ఇందులో A అనగా విజయం, X అనగా పని, Y అనగా ఆటలు, Z అనగా నోరు మెదపకుండుట అని చెప్పాడు.

విజయం సాధించే మార్గమేమిటంటే అతిగా మాట్లాడకుండా నిరంతరం చేపట్టిన పనిచేయడం, మధ్యలో శరీర శ్రమ కోసం ఆటలాడడం !

ఇలాంటిదే మరొక మేధావి చెప్పిన సమాధానం కూడ గుర్తు చేసుకుందాం.

స్వరాజ్యం రాకపూర్వం 1940 ప్రాంతంలో లక్నోలో తేజబహాదూర్ సప్రూ అను మితవాద కాంగ్రెస్ నాయకుడుండేవాడు. ఆయన దేశంలో ప్రఖ్యాతిచెందిన న్యాయవాది కూడాను.

ఆ రోజుల్లో స్వామి చిన్మయానంద లక్నోలో న్యాయశాస్త్రం చదువుచుండేవారు. ఒకనాడు వారు తేజబహాదూర్ సప్రూను కలుసుకొని "దేశంలో మీరు అతి గొప్ప

న్యాయవాదిగా పేరొందారు. మీరీ ఉన్నతస్థితికి రావడానికి గల రహస్యమేమిటో సెలవిస్తారా?" అని అడిగారు.

అందులకు సప్రూ "నాయనా, జీవితంలో విజయం పొందుటకుగల రహస్యమేమనగా, ఒక యెద్దువలె కృషి చేయాలి; ఒక సన్యాసివలె జీవించాలి. నేను సినిమాకు వెళ్ళి 22 సంవత్సరములైనది. డబ్బులేక గాదు - వ్యవధిలేక" అన్నాడు.

జీవితంలో విజయం పొందే మార్గాన్ని సప్రూ మహాశయుడు చక్కగా చెప్పాడు. ఒక ఎద్దువలె ఎంతపని అయినా చేయడానికి సిద్ధంగా వుండాలి. ఒక సన్యాసివలె తక్కువ అవసరాలతో జీవించాలి. సుఖాల కొరకు వెంపర్లాడగూడదు.

విద్యార్థులకు ఉపకరించే గొప్పసత్యాన్ని మహామంత్రి చాణుక్యుడు చెప్పాడు. ఆయన పలికిన సత్యమిది: "విద్యార్థియగువాడు కామమును జయింపవలెను; నాలుకతీపి మరువవలెను; తనకొక అక్షరముపదేశించినను, అట్టి వానిని గురువుగా, దేవతాసమునిగా పరిగణించవలెను."

మరొక ప్రాచీనకవి ఇలా హెచ్చరించాడు: "సుఖమ్ము కోరువాడు విద్యను వదలుకొనవలసినదే; విద్యనే కోరువాడు సుఖమును త్యజించవలసినదే. సుఖార్థులకు విద్య ఎక్కడ, విద్యార్థులకు సుఖమెక్కడ?"

కనుక విద్యకూ సుఖాలకూ చుక్కెదురు. విద్యార్థి సుఖాలవెంటపడరాదు.

పరీక్షలలో విజయం సాధించడానికి పై మూడు అంశాలు మిగుల ఉపయోగిస్తాయి!

# విద్యార్థులు చదువవలసిన పుస్తకాలు

వెల స్వల్పం! విలువ అధికం!

1. కాంతిరేఖలు (మొదటిభాగం) రు. 15-00
2. కాంతిరేఖలు (రెండవ భాగం) రు. 15-00
3. కాంతిరేఖలు (మూడవ భాగం) రు. 12-00
4. మణిపూసలు (Telugu Quotations) రు. 30-00
5. పనికొచ్చే కథలు (మొదటి భాగం) రు. 10-00
6. పనికొచ్చే కథలు (రెండవ భాగం) రు. 10-00
7. చదువుకుంటే బహుమతి రు. 6-00
   (23 నీతికథల సంపుటి)
8. ఎలా చదవాలి ? రు. 4-00
   (పరీక్షలలో ఉత్తమ ఫలితాలు సాధించ
   డానికి ఎలా చదవాలో వివరించే పుస్తకం)
9. సూక్తిసుధ (53 సూక్తులు, వాటి వివరణ) రు. 6-00

* *

సంపాదకుడు :

మన్నవ గిరిధరరావు ఎం.ఏ. (Ex.M.L.C.)

* *

ప్రచురణ :

యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ (రిజి)

కృష్ణనగర్ : గుంటూరు - 522 006